# కృషీవలుడు

— ఆనంద్
— మధుసూధన్

కవికోకిల

దువ్వూరి రామిరెడ్డి



# కృషీవలుడు

(పద్యకావ్యము)



ప్రతులకు:
వి. డి. మూర్తి
బుక్ సెల్లర్సు
ట్రంకురోడ్డు - నెల్లూరు.

కవికోకిల
దువ్వూరి రామిరెడ్డి

# ఉపోద్ఘాతము

ఆంధ్రవాఙ్మయమున ప్రకృతము ప్రసిద్ధికి వచ్చుచుండెడు గణ్యములగు నూతనసృష్టులలో నీ కావ్యమొకటి. విషయమందును భావములందును ఇయ్యది మనదేశముయొక్క నవజీవితమునకుం జేరినది. అచ్చటచ్చట శైలియందును 'దూరోపమలు మొదలగు నలంకారముల యందును ప్రాచీనవాసన యింకను కొంత వదలవలసియున్నట్టుల తోఁచెడిని.

కవి కాఁపుయువకుఁడు; విషయము కాఁపులజీవితము, దృష్టి యభిమాన ప్రేరితము. కృషీవలుల జీవితమును ప్రధానాంశముగ గ్రహించిన తెలుఁగు గ్రంథములలో నిదియే మొదటిది. ఈవిషయ నవ్యతను దలంచియే కాఁబోలు రామిరెడ్డిగారు ఈ క్రిందివిధమున వితర్కించి యుండుట :

అన్నా హాలిక, నీదుజీవితము నెయ్యంబార వర్ణింప మే
కొన్నన్, నిర్ఝరసారవేగమున వాక్పూరంబు మాధుర్యసం
పన్నంబై ప్రవహించుఁగాని, యితరుల్ భగ్నాశులైయీర్ష్యతో
నన్నుం గర్షకపక్షపాతియని నిందావాక్యముల్ పల్కరే?

తాను పూర్వలాక్షణికుల కరిగాఁపుగాఁడనియు స్వచ్ఛంద విహార శీలుఁడనియు నీక్రింది పద్యములలో బాహాటముగ చాటించియున్నాఁడు.

వనలతమైన నాకవిత పత్రపుటంబులఁ బూవురెమ్మలన్
దినదిన జృంభమాణయయి తేజరిలెన్ సహజప్రరోహ వ
ర్ధననియమానుసారముగఁ, దల్లత యెన్నఁడుఁ దోఁటమాలి పా
ణినిఁ గనుగోని వన్యరమణీయతఁజిల్కు నపూర్వపద్ధతిన్.

పంజరనిబద్ధ కీరంబు బయలుఁగాంచి
యడ్డుకమ్ముల దాఁటంగ నాసచేయు
నటు బహిర్నియమంబుల నతకరించి
మన్మనంబు స్వాతంత్ర్యసీమకుఁ జరించు.

కాన, యెవరేమియనుకొన్న దాన నేమి
గలుగుఁ? గాలమనంతము. ఇలవిశాల.
భావలోకము క్రమముగాఁ బడయుమార్పు:
ఏల హృదయంబు వెలిపుచ్చ నింతయళుకు?

తన కవిత వవలత; స్వచ్ఛందవ్యాపనముగలది. చెన్నపురిలోని మాలీల దోహదములు కత్తిరింపులు మొదలగు చికిత్సలచే కృత్రిమసౌభాగ్యము వహించిన పూలపెట్లు వంటిదిగాదు, "సహజ ప్రరోహవర్ధన నియమానుసారముగ" నల్లనట్టిదిఁగా. "అపూర్వపద్ధతి" నవలంబించినది. శాస్త్రకారుల యాదేశములను, పారంపర్యప్రాప్త బహిర్నియమంబుల పాటింపదు. ఆగమపుంజములకు చేరినగతానుగతికము కాదు. స్వాతంత్ర్యసీమను జరించునది. ఏమీ! పూర్వికుల విధులను అతిక్రమింపవచ్చునా ? వారేర్పఱచిన కృతి విధానములుగాక అన్యము లెక్కడనైననున్నవా? అని మూఢభక్తులెవ్వరైన ఆక్షేపించిన యెడల "కాలమనంతము, ఇలవిశాల, భావలోకము క్రమముగాఁ బడయు మార్పు" అని కవి వారిని తిరస్కరించి తన దారిన తా నేగెడిని. వీరు చేసియుండెడు కవితావిషయమైన చర్చను కొన్ని యేండ్లక్రిందట సందర్భానుసారముగ నేనును "కవిత్వ తత్త్వవిచారము"లో చేసినాఁడను.

"ఐరోపాలోని కవీశ్వరులు కొందఱు కాఁపువారు, సైనికులు, మొదలైన తక్కువ వృత్తులవారి బ్రతుకులను వర్ణనార్హములని భావించి యెంతో సుందరముగఁ గావ్యములలో వ్రాసియున్నారు. మనగ్రంథముల

మాత్రము చదివి యీ పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రముయొక్క స్థితిగతుల నరయఁ జూచువారికి ఈ దేశమున బీదసాదలపై నాదరముగల కవి యెవఁడైన నున్నాఁడా? తుదకు బీదసాదలైన నున్నారా? యను సంశయము పట్టినను తప్పువారిది కాదు! శోకరసము వర్ణింపవలయునన్న ననుకూలమగు సందర్భ మెయ్యది? క్రొవ్వుకాఱెడి నాయికానాయకుల యూహామాత్రములైన కష్టములా? ప్రజలు దినదినము కన్నీరుగాగ్చుటకైన నవకాశములేక కుడుచుచుండు పరిపరివిధములైన గోడులా? శాంతరసమునకుఁ బోషక మెయ్యది? తమకుఁ గష్టముదేనట్టివైన రాజులయొక్క యుదారచర్యలా? ఆఁకటమాడి మలమలమాడుచు నింటికివచ్చి వంట సిద్ధముకాకుండినను భార్యపైఁ గోపింపక, కన్నులు మూఁతవడుచుండ విధిని ధ్యానించుచు నొకమూలఁ గూర్చుండు పొలముకాఁపులయొక్క నడవడియా? ఆహా! జనసామాన్యముయొక్క ప్రతిదిన వృత్తములలో నెంతభావము, రసము, గుణము నుపగతములై యున్నవో మనకవులకుం దెలియవుగదా! రాజపుత్రులను రాజకన్యలను, చాలనందుకు బ్రాహ్మణులను వేశ్యలనుబట్టి ఝుంఝూటమాడుటదప్ప కవితకు మేలైన యన్యార్థములు లేవా? ”

ఉన్నవి యనుటకు ఈ “కృషీవలుఁడు” ను, అబ్బూరి రామకృష్ణరావు, రాయప్రోలు సుబ్బారావు మొదలైన యువకులు విరచించియుండెడు నవ్యకావ్యములును ప్రమాణములు.

ఈగ్రంథమునందు పొలముకాఁపులయు కాఁపుటిల్లాండ్రయు వైనందిన చర్యలతోడ ఋతువర్ణనములను కవి బహు చమత్కారముగ సమన్వయించి యున్నాఁడు. ఇది భావగంభీరులకేగాని శుష్కపండితులకు సాధ్యమగు క్రియగాదు. ప్రాతఃకాలమునుండి రాత్రి నిద్రపోవువఱకు కృషీవలులుచేయు కార్యములొకకూర్పు. వీనితో సమ్మేళించినవిధమున చేయఁ

బడియుండెడి ఋత్వాది ప్రకృతివర్ణన మింకొక తూర్పు. రెండును భావకళా నిర్మితములును శోభితములును అయిన ప్రకృతి ప్రతిబింబములట్లు సత్యమును రామణీయకమును దాల్చియున్నవి. కృతి పరిమాణమున చిన్నదైయ్యును గుణమున నానా సౌభాగ్య శోభితముగనున్నది వీని నన్నిటిని విడఁదీసి ప్రదర్శింప వలయునన్న సూత్రమున కన్నను వ్యాఖ్యానము విపులమగును. అట్లు చూపుటచే చదువరుల భావపరిశ్రమ విక్షేపములకు నిరోధముగల్గును. కాన, కొన్ని యంశములను పేర్కొని విరమించెదను.

ఇంక గ్రామాంతర నివాసము వ్యవసాయవృత్తి ఇత్యాది ప్రకృతి సామీప్యజీవితమునకును మనుష్య స్వభావ ప్రవృత్తికిని ఉండు సంబంధము చూపఁబడియున్నది. మొత్తముమీఁద పట్నవాసు లంత మంచివారు గారనియు, గ్రామవాసులు నడవడియందు మేలుతరమైన వారనియు కవి యొక్క యభిప్రాయము. ఇది నిర్వివాదము కాదని నామనవి. పట్టణస్థులకు గ్రామస్థులకు చర్యాభేదములు, స్వభావభేదములు లేవనలేముగాని, పోలికలను పెంచి యెక్కువతక్కువలను రూపించుట సాహసకార్యము. దేశాభ్యుదయమునకు పల్లెటులలో పురములును నట్లే యావశ్యకములు. మఱియు ఆర్థిక ప్రపంచమునకు ఆధారము వ్యవసాయమని కవిగారు చూపియున్నారు. ఇది నిజమేగాని తక్కిన వాణిజ్యాది యభ్యుదయములు లేనిచో దేశము సమగ్రత తాల్పనేరదు.

నవ్యపాశ్చాత్యసభ్యత నాగరకత
పల్లెలందు నస్పష్టరూపములఁ దాల్చి
కాలసమ్మానితములైన గ్రామపద్ధ
తులను విముఖత్వముం గొంత గలుగఁజేసె.

నేఁటి నాగరకత నీ మేలుఁగోరక
యప్పుచేసి బ్రతుకుమని విధించు;
నాయవృద్ధికన్న నావశ్యకపదార్థ
సంఖ్య హెచ్చుఁ జిత్తశాంతియున్నె ?

కవికి పరిణామము వలయునో వలదో తెలియకున్నది. కవితా భావములను శాస్త్ర తత్త్వములంబలె తార్కిక దృష్టితో విమర్శింపఁ దగదు. వానియందు రసికులు గమనింపవలసిన విషయము సౌందర్యము. అగుణమీ కావ్యమందు అఖండముగ నున్నది.

అసంబంధములగు వర్ణనలు సంగతులీగ్రంథమున లేవు. ప్రతియంశము చిత్తరువున కనుకూలించినదియు అగత్యమైనదియుఁగా నున్నది. సంయోగతాలక్షణ మిందు ఏమాత్రము భంగము చెందకుండుట కవియొక్క భావనాగాంభీర్యమునకు అమోఘమైన సాక్ష్యము. తా వర్ణించు జీవితమును విషయములును తనకు అనుభవవేద్యములు కాఁబట్టియు, వానియందు తనకు మనసు హృదయ సంపూర్ణముగ లీనమై యుండుట చేతను వర్ణనలన్నియు హృద్యతాగుణ పరిశోభితములు. వానియందు సత్యస్ఫురణ, మనోహరత, హృదయాకర్షణాది శక్తులున్నవి. ఇదియ శిల్పముయొక్క పరమార్థము.

పాశ్చాత్య భాషలలో "పాస్టొరల్స్" నాఁబడు పాశుపాల్యాది గ్రామాంతర వృత్తులవారి అకృత్రిమ జీవితస్వభావాదుల వర్ణించు కావ్యములనేకములున్నవి. అవ్వివి గ్రీకు లాటిన్ భాషలలో పుట్టి ఆధునిక యిరోపా వాఙ్మయములయందును వ్యాపకమునకు వచ్చియున్నవి. హైందవ భాషలలో ఈ తరగతికిం జేరిన కావ్యములలో శ్రీకృష్ణుని బాల్యలీలలు, శ్రీ బృందావనజీవితము, గోపగోపికాసంచారములు ఎంతయు హృదయరంజక

ములు. భాగవతమునందలి దశమస్కంధమును, విశేషించి యెఱ్ఱాప్రగ్గడ యొక్క హరివంశ పూర్వభాగమును, దేశీయవాఙ్మ్రపంచమున తమస్సు నడంచి చల్లని వెన్నెలను కురిపించి చిత్తానందముచేయు చంద్రబింబము లవలె నున్నవి. జయదేవ కృతమైన గీతాగోవిందమును నిట్టిదియు. గోపిక లను వదలిన గ్రామాంతరజీవిత మలభ్యమనియో, కృష్ణకాంతలకు తదనం తరము గోపికాసంతతులునశించిరను భ్రమగొనియొ మనకవులు అట్టివర్ణ నలను, ఇతరసందర్భముల ముఖ్యాంశములుగ గైకొని వర్ణించుట మాని వేసిరి. ఈనాఁటికి ఆ వృత్తములు మరలకవితాదృష్టికి నర్హములని భావిం పఁబడుట తటస్థమైనది. ఇట్లెప్పుడో నశియించిన మహోత్తరమైన వృత్తి మును పునర్జీవితముంజేసి దివ్యాకృతిగ మనముందర రామిరెడ్డిగారు నిలిపి యుండుట వారి యసాధారణప్రజ్ఞను సూచించుచున్నది.

కృషీవలుని జీవితమంతయు పువ్వులపాన్పు గాదని కవిగారెఱుం గక పోలేదు. పట్నవాసులకు వారికిఁగలుగు ఆర్థికస్పర్ధ, సర్కారువారు వారి యెడల చేయు అనాదరణము, ముఖ్యముగా వారి నావరించియుం డెడు అజ్ఞానాంధకారమును, దానిచే వారినిపట్టి బాధించెడు దురాచార పిశాచముల విషయమును రాజకీయ సాంఘికాదినీతులును, సంస్కారముల యావశ్యకతను సూక్ష్మముగఁ దడవియున్నారు. మింటికెగయుపక్షియైనను భూమిమీద పెట్టియుండెడి గూటిపై చూపువేయక యుండునా? కాఁపు వారియొక్క దుఃస్థితి యెప్పుడు తొలఁగును? వారికముందైన పూర్వపు రెడ్డిరాజుల కాలమందువలె ఉన్నతపదవికిరారా? అను విచారములు అసలు సహజములే గద. "కాలగర్భంబునందెట్టి ఘటనగలదో; భావి పరిణామ మెవ్వరు పలుకఁగలరు" ఎవ్వరు పలుకఁగలరో గాని నావలన మాత్ర ముగాదు. రైతు లెట్టి దారిద్ర్యముపాలైయున్నారు! "కార్యారంభంబు ను ధైర్యముఁ విడకు మయ్యా" అని కవిగారు సంభోదించుచున్నారు. వీరి మాటల నాలకించి యాదరింతురు గాక. ముఖ్యముగ మాకులమువారికి

అతిథి సత్కారము ఒకరు చెప్పక చూపక వచ్చిన సదాచారము. అన్నదానము మావారివలె చేయువారితరు లున్నారో లేరో. ఎట్లును మించిన వారు లేరనుట అతిశయోక్తిగాదు. ఈవిషయమును రామిరెడ్డిగారు ఈక్రింది విధమున రమ్యముగ నుడివి యున్నారు.

ఉండి తిన్నను లేక పస్తున్నఁగాని
యాస చేయవు పరుల కష్టార్జితంబు;
నాఁక లెత్తగ నీపంచ కరగు నతిథి
తినక త్రావక పోయిన దినము లేదు.

కాఁపుటిల్లాండ్రను గూర్చి కవిచేసిన స్తుతులన్నియు సత్యమునకు మీఱినవి కావు; తక్కువ. వారియొక్క "శాంతినీతియు నురుకష్టసహనశక్తి, నెవ రెఱుంగుదురు?" స్త్రీలంగూర్చి వీరొనరించిన ప్రశంస యెంతయు సత్యము; గంభీరమును.

అతుల సంసారసాగరమందుఁ గాల
జలము సుకృత దుష్కృతవాత చలితమగుచు
సుఖవిషాదపుఁ దరఁగలై సుడియుచుండ
పడవవై గట్టుఁజేర్తువు పతిని, గృహిణి!

సంగ్రహించి వ్రాయుశక్తియందు ఈ కవిని మించినవారుండరు కాఁబోలు. ఈ గ్రంథమును జదువఁ జదువ ఏరీతిని ఇన్నియంశములను ఇన్నికొద్దిపుటలలో నిక్షేపించినాఁడు అను ఆశ్చర్యముఁ దాల్పనివారుండరు. పునరుక్తి నిరర్థకవృత్తి, యిత్యాది కాలవ్యయమును, స్థలవ్యయమును చేకూర్చు పద్ధతులు లేవు. తన కులస్థులయట్లె యీకవియు మితభాషి. అర్థము ఎక్కువ పదములు తక్కువ అను శ్లాఘనకు పాత్రుఁడు.

మనుచరిత్ర కళాపూర్ణోదయాదులలోని పద్యముల ననుకరించిన తలపోతలు వ్రాతలు ఒకటి రెండు చోటుల నున్నట్లు తోఁచెడిని. ఇక

దోషముగాదు. ప్రమాదము కావచ్చును. వీరి యాథార్థ్యవర్ణనాశక్తిని చూపించుటకై కొన్ని పద్యముల నుదహరించుచున్నాను.

### లయవిభాతి

చలువగల కప్పురము చిలికినటు చల్లనయి,
లలిత కలధౌత మృదు విలసనము పోలెన్
మొలక లిడు వెన్నెలల చెలువము దిగంతముల
కలముకొని తారకల తళుకులను గప్పన్
గలువపొడి గందవొడి దొలఁక నుడిరేఁగుచును
మెలఁగు నెలపయ్యరలు నలసతఁ జరింపం,
దలఁపున రసార్ద్రమగు వలపు లిగురింప దిన
కలకల మడంచి నిశ గొలిపెఁ బ్రమదంబున్.

స్నానమొనరించి వెన్నెల చలువ బయల
బిడ్డలున్నివు నిల్లాలుఁ బ్రీతిఁ గుడిచి,
పొడుపు కతలు, సమస్యలుఁ, బూర్వచరిత
లంత వచియింపు వారలు సంతసింప.

శ్రమ, విషాదమ్ము, లాసలు, సర్వకాల
హృదయభేదక చింతలు, నిదుర యనెడు
శాంతవారిధి లీనమై పమసిపోవ
విశ్రమింపుము సైరికా వేగువఱకు.

నేనును విశ్రమించెదను. వేగువఱకుగాదు. మఱి రామిరెడ్డిగారు ఇంకొక గ్రంథము వ్రాయువఱకు. వ్రాసినతోడనె పఠనమునకుం దొడంగెద.

ఇట్లు,

కట్టమంచి రామలింగారెడ్డి

# ప్రేమాంకము

ఆన్నా. మన్నెము శేషరెడ్డి, యెటులో
　　　యావిర్భవంబొంది
స్నేహౌన్నత్యంబు పరస్పరంబు రమణీ
　　　యానేక భావంబులం
జెన్నారెన్ హృదయానుబంధరచనా
　　　చిహ్నంబుగన్, మాయుపా
యెన్నండుం దలచూపదిందనుక
　　　ద్వైపేచ్ఛా పరిభావంబునన్.

అట్టి నిర్మలమైత్రికి నానవాలు
నవ్య కవితాసుమంబుల దివ్యమాల
నెమ్మిఁ గీలించుచున్నాఁడ నీదుకీర్తి
కామినీ కంఠసీమను గాంతులొలయ.

ప్రియమిత్రుఁడు

దువ్వూరి రామిరెడ్డి.

# కృషీవలుడు

సమయమమూల్య, మొక్కనిమి
షంబువృథాచనఁగ్రమ్మఱింప నే
రము;మనయాయు వాత్రుటిప
రంపరయాట నెఱింగి నిద్రమాం
ద్యమునుదొలంగి మీపనుల
నారయుఁ డోజనులారయంచు డం
బముగ మెడన్నిగిడ్చి కృక
వాకువుగూసెడి నింటికొప్పునన్.

వడఁకుచుఁ బాడు మేల్కొలుపు పాటకు రాటము ఝుమ్ముమంచుఁ జే
సెడి మధురారవంబు శ్రుతి చెల్వువహింపఁగ, రాజనూఁది ముం
గడ నిడికొన్న కుంపటి సెగన్ సొగియించుచు నమ్మలక్క లొ
క్కెడ గుమిగూడి నూల్వడకు నిత్తఱిఁ దోఁచెను రెడ్డిచుక్కయున్.

అత్తల యాఁడుబిడ్డల భయంబొకవంకయుఁ గోర్కె వేఱొకం
జిత్తములాఁగఁ గ్రొవ్విదయుఁ జీరయు వేసవరించి తూఁగుమై
మత్తున నున్నవల్లభుని మంచము మెల్లన వీడి దీనయై
బిత్తఱికోడ లిల్వెడలె వేకువఁ గ్రాఁచిపనుల్వొనర్పఁగన్.

రచ్చ చపారమందు నిడి రాతిరిఁ బుచ్చిన బాటసారులుం
జిచ్చు రగిల్చి మంటలకుఁ జేతులు చాపుచుఁ గూరుచుండి వా
రిచ్చకు వచ్చినట్టి కతలెల్ల వచింపుచుఁ దెల్లవాఱఁగా
వచ్చిన మూటముల్లెగొను పైనపుసందడి రేఁగ గొల్లునన్.

"అమ్మా! తూరుపు దెల్లవాఱెనిఁక లెమ్మా" యంచన్ మాల్గి, మం
చమ్మున్ డిగ్గక, బుజ్జగించినను, "పోఁ చాల్చాలు, వేన్నీళ్ళు తే
కైమ్మో నేఁ బలుదోముకొందుఁ జలిలో, నింతా గడంబా? యటం
చమ్మం గూఁతురు కోపగించుకొనుఁ గన్యాత్వంపు గారామునన్

ప్రొద్దుపొడుపను కాఁపు పూఁబోడి రాజ
నముల వరిచెన్నుగంప గేహమున దింప
సంబరంబున నెగురుచు సరసఁజేరు .
పిల్లలనఁ బుల్గుతుట్టుములు వింటికెగసె.

అరుణమయూఖముల్ తరులతాంతరమార్గముదూరి గేహగో
పురములఁ బ్రాఁకు బ్రొద్దువొడుపుం దరుణంబున నీటికోసమై
సరసుల కేఁగు కాఁపు నెఱజాణల నూపురమంజులార్భటుల్
నెఱసెఁ బ్రభాతమర్క శిశువు నేర్చెడి ముద్దులమాటలో యనన్.

ఇరువ్రులఁ జూరులాదుఁ జరియించి తమోహరణైక దక్ష భా
స్కర కిరణాళి నీమృదులశయ్య సువర్ణమయంబు చేసె ని
ద్దుర నిఁకనైన మాని వెలిదోలుము బీళ్ళకు నాలమంద, ని
త్తఱిఁ దమిదీఱ మేయుఁ బులుదంటులుఁ గమ్మనిమంచుపచ్చికల్.

ఓయిహాలిక! యెంత ప్రొద్దాయెఁ జూడు
మింత నిదురేల? పాలకై గొంతురాయ
లేఁగ యాదూడ పలుపును లాఁగికొనుచు
నఱచు చున్నది ''యంభయంభా'' యటంచు.

పొదుగు నిండుగఁ బాల్చేపి గుదులు ద్రెంపి
దూడకై దొడ్డిగోడ రాపాడి దాఁటెఁ
దటెపి పెయ్య; యింకేల మాంద్యమునఁ బొరల?
లెమ్ము నిద్దుర; పాల్దీయఁ దెమ్ము చెంబు.

బిట్టుకడుపుగ నన్నంబుఁ బెరుఁగుఁ గుడిచి
దొడ్డి వెడలించుచున్నాఁడు గిడ్డిగములఁ
దమ్ముఁగుట్టాఁడు; లేదూడ లమ్మలకును
బరుగు లిడనీక కట్టుము పలుపువెట్టి.

చెమరు ముత్యాలు చెక్కిళ్ళఁ జెదరి జాఱ
పైట తెరవెన్క జమరి పోరాటమెసఁగ,
గాజునీలాలు మధుర నిక్వాణము లొలయ
దధి మధించెడు కాంత గీతములు వినవో?

ఉయ్యేల నిద్రలేచి తనయుం డెదుటఁ జనయిత్రిఁ గాంచకే
కుయ్యిడుచున్నవాఁడు కులుకొంగను దమ్ముల బాష్పబిందులో
య్యొయ్యనఁ జిందువాఱ, సతియున్నికటంబున లేదు, లేచియ
బయ్యను నెత్తి మేను పులకాంకితమౌనటు ముద్దు వెట్టుమా.

చలికప్పఁగప్పి విచ్చలవిడి లేయెండఁ
గ్రాగు ముద్దులకూఁతుఁ గౌఁగిలించి,
పురికి దోఁగాడు మ బొమ్మలతో నాడు
పసిబిడ్డమోము చుంబనముచేసి,
ఎఁగతాలి సరసాల నిల్లాలు పలుకుచు
నవ్వినందుకు మాఱునవ్వు నవ్వి,
పనివాండ్రు వచ్చియుండినఁ దండ్రియేమను
నో యను శంకలో నొరసికొనఁగఁ,

జలిది కడుపారఁ గుడిచి యెద్దులను దోలి
కొనుచు మడి కేఁగుచున్నారు, గనుమ యొరులు
వారు నీతోడివారలు గారె? రెడ్డి
యువకు లెచ్చటఁ గొఱగాకయుందురయ్య?

మనపనిఁ జేసికొన్న నవమానమె? ప్రాఁచిపను లొనర్చుచుఁ
వనిత యతిప్రయాసమునఁ బర్వులిడం గనుఁగోవె? కావడిం
గొని సరసీజలంబులను గోపముసేయక తెచ్చియిచ్చి కాం
తను బరితోషపెట్టుము; వృథాచన వెప్పుడు నట్టిసాయముల్.

సోమరిపోతవై జనకు సూక్తుల లక్ష్యముచేసి కొంకెపో
రాములఁ బ్రొద్దుపుచ్చకు, నిరర్థకభూములనైనఁ జెమ్మటన్
శ్యామల సస్యవంతముగ సల్పెడు కాఁపులు నోగులైన నిం
కోమెడువార లెవ్వరు జనోత్కరమున్ సరసాన్నదాతలై!

అరుణకిరణుండు తూర్పున నవతరింపఁ
బ్రాణిలోకంబు మాంద్యమ్ముఁ బాసె; నింక
నింటనుండుట మర్యాదయే కుమార ?
చలిదిచిక్కంబు గట్టుము పొలముఁ జేర.

అప్పుడప్పుడె విచ్చి యలరు చేమంతుల
        కమ్మని నెత్తావి గడలుకొనఁగ,
రత్నకంబళ మట్లు రాణించు బీళులఁ
        బలువన్నెపూవులు బలిసి విరియ,
వ్రాలఁబండిన రాజనాల కేదారంబు
        పంటలక్ష్మికి నాటపట్టుగాఁగ,
ప్రొద్దునిగ్గులు సోకి పొగమంచుమబ్బులు
        బంగారు వలిపంబు పగిది వ్రేల,

ఈ నిమేషమందు నిల యెల్ల నందమై
స్వర్గశిల్పి యింద్రజాల శక్తి
వ్రాసినట్టి చిత్రపటమన విలసిల్లెఁ;
దొంగిచూడు మిపుడు తూర్పుదిక్కు!

వేకువనె లేచి వైకుంఠవాకిళులను
ముంగిట రచించి గుమ్మడి పూలతోడ
గొబ్బిముద్దల నిలిపి కుంకుమను జల్లె
నీయనుంగుకూఁతురు! గాంచుమోయి సొబగు.

గనిమల తుంగకుఁ గేకికాడల కల్లిన సాలెగూళ్ళ స
న్నని పటికంపుమంచు పడి నాణెపు ముత్తెసరాల పోలికం
గనుఁగొన రమ్యమయ్యె రవికాంతులఁ దేలుచు, నిట్టిభావమో
హనపు నిసర్గశిల్పములు, హాలిక! త్రొక్కక దాఁటిపొమ్మిఁకన్.

పొలముల కేఁగు పల్లెతలు పుత్తడిగాజులు ఘల్లుమంచు రా
పిలి యులివెత్తగం జిటికెవేయుచు నిగ్గని యేలపాటలం
జెలువుగఁ బాడ నుప్పతిలు సిగ్గున నూరకపోక మాఱుపా
టల నెలుఁగెత్తి పాడుమ, మిటారుల నవ్వుల కాస్పదంబుగన్.

గ్రామవాసుల కిట్టి నిష్కైతవంపు
ముగ్ధపరితోషములు సుఖభోగ్యములగుఁ;
బట్టణ నివాసకుల శుష్కభావములను
నిట్టి సామాజికానంద మెసఁగఁగలదె?

ఓయి రెడ్డియువక! యూరక యిందందుఁ
దిరుగ నేమి ఫలము? తిండిచేటు!
తండ్రి కోఁతమడుల దగ్గఱఁ బనిసేయు,
నన్నమునకు నింటి కనుపుమయ్య.

వ్రాలిన కొప్పులోపలి పూలరేకులు
సడలి యొక్కొక్కటి జాఱుచుండఁ,
బరువంపు రొమ్ముపైఁ బయ్యెదచినుఁగుల్లు
గాలికి నట్టిట్టుఁ గదలియాడ,
నెలుగెత్తి పాడెడి యేలలు విని బాట
సారు లెక్కసకెము సలుపుచుండఁ,
దమ్ములపుంబూఁత దవిలిన వాతెఱ
పైఁ బలుచాలు నవ్వొకయొ నవ్వఁ,

జేతకొడవలి ఝుళుపుచుం జిన్నెలాడి
కన్నెమాంతైత పిడిచుట్టి ముస్నముస్న
మునుపు తెలగెడి; నింటికిం బోవువేళ
సందెసోదె యీ తేవె కర్షకకుమార?

ఆఁకటి చిచ్చుబాధసగమైన గొడ్లను నంటు డొక్కలుం
జీఁకటిమూపులుం మొలకు జేనెడు పేలిక గల్గి జీవితం
బే కడగండ్లుగాఁ, బరిగయేరెడు బీదల వెళ్ళగొట్టి చీ
కాకొనరింపఁబోక; వెలిగాదల యాఁకటిమంట నీకునుం.

పసిఁడిపూసల పేరుల పసిఁడి సోర
పక్కముగఁ బాడి నేలకు వ్రాలు కంకి
గుత్తులఁ బిచుకతిండికిఁ దెస్తుననుచు
నింతికిం జెప్పి మఱచితే యింతలోన?

పడఁతి యొంటికత్తె; పనిపాటు సేయను
నిడుగు దోడుగులకును నెవరు లేరు;
చంటిబిడ్డ యొకఁడు, సంసారభారంబు
పీల్చి పిప్పిసేయు బీదరాలి.

చెలియా, యిత్తఱినిన్నుఁ గన్గొనిన నాచిత్తంబు తాపార్తమై
కలఁగుం, గష్టకుటుంబకార్యముల నెక్కాలంబు నిర్మగ్నవై
మెలఁగంజూతువు మాసిచీర రవికెల్ మేలౌ నలంకారముల్
దలఁపంబోవు, తలైనమువ్వ; వింక లేదా మేర నీపాటుకుఁ?

మున్నూటరువది దినముల
నెన్నండును గన నశక్య మేపనియును లే
కున్న నిమేషము; కాఁపుం
గన్నియ, నీ కాటవిడుపు కాలము లేదే?

నిత్యకృత్యములం దొక్క నిమిషమైన
దొంగిలింపుము కై సేయఁ దోయజాక్షి!
యఖిలకామినీ సామాన్యమౌఁ బ్రసాద
నప్రియత్వము నీయందు ననలుకొనదా?

స్వాంతమున నీకు రామణీయకపిపాస
యంతరించె నటంచు నే ననను గాంత,
కాని, యెడలేని సంసారకష్టములకు
స్త్రీప్రకృతి బలివెట్టుట చెల్లదమ్మ;

త్యాగమ సక్తిననిశహద్దు దగునుగాని
శలభ మట్టుల నాత్మనాశనము మేలె?
పొలఁతికి సతీత్వ సౌందర్యములును రెండుఁ
ప్రార్థనీయవరంబులై పరఁగుఁగాదె!

అతివ, నాయూరడింపుల యందె దవిలి
చిన్నికూఁతురి నంపవు జొన్నమడికిఁ,
బావురంబులుఁ జిల్కలు వాలకంకి
విఱచుకొని యాకసంబున వెడలెఁ జూడు!

పడెనటఁ జిల్క లన్న మిషఁ బైట దొలంగినఁ జూచిమూడకే
యొడిసెల ఱాయిఁ బెట్టి పొలమోరలఁ బోయెడి బాటసారిపైఁ
బడఁ దెగ ఉవ్వెదేల మగువా, యిటులం బహుచుందనాల తుం
దుడుకుఁదనంబు నీయెడఁదఁ దొందరవెట్టెనె? నైజమేగదా!

"ఐననయ్యెఁగాని, యాఁకలి బలువొడ్డ,
రెండు కంకు లిమ్ము రెడ్డిపడుచ!
ప్రొద్దువోవు మాదు పొలిమేరఁ జేరను,
బాట నడచి నడచి బడలె మేను."

అని కడువేడు పాంథులకు నచ్చటం జేతికినందు కంకులం
దినుఁడని చెప్పి మంచెపయిఁ దియ్యని రాగము దీయ ప్రాయపుం
గొనబుమిటారి, నీమనసు కుందు నెఱుంగదు గాని, యింటిలోఁ
ననయము లేమిడిం గని సయించు నమ్మవెతల్ దలపోయ వేలొకో!

చిన్నప్రాయమందె చీడపుర్వను దెచ్చి
నీదుహృదయకలిక నిలుపఁదగదు;
పచ్చపైరుచేల బాంధవ్యమునఁ జేసి
పెరిగినావు ప్రకృతిబిడ్డవోలె.

పూలకారుగాలి పొలముపై వీతెంచె
వలపు మొలిచి యొడలు పులకరింప,
మనసుకోఁతలెల్ల మానిపోఁ గోయిలఁ
గూడి పాడు మొక్క క్రొత్తపాట.

పైరుంబచ్చలులేని లో[illegible] బాపంబోలెఁ గ్రొంబూలసిం
గారంబుం గయిసేసి లేఁజివురులం గాంతల్ల వల్లీతతుల్,
దారింబోయెడు బిచ్చకత్తె యయినం దావుల్ గుబాళింపగం
బూరేకుల్ చికురంబులందుఱిమి సొంపుంబెంపుఁ బాటించెడిన్

కనుమ, యాబిచ్చకత్తెకుఁ గలసుఖంబు
నందు సగపాలు లేదు నీయాలి కకట !
పవలు నిద్రించెదే కాఁపుపడుచువాఁడ,
పొలఁతి నిట్టూర్పు నీయెద పొగిలిపోదొ ?

కాఁపులెల్లరు నాగళ్లు గట్టి కోడ
యడుగు దున్నెద రిపుడు ; నీ వదనెఱుఁగవా ?
యాలసింపక యెడ్లఁ గయ్యాలను దోలు
మోయి, యెండలు ముదిరి పెల్లుక్కవెట్టె.

శ్రమలు లేకయె ఫలములు దుముకఁబోవు;
పిండికొలఁదియె రొట్టె ; యోపిన విధానఁ
గష్టపడుము కృషీవలా, గలుగు సుఖము.
ఉత్తయాసలకన్న మే లుద్యమంబు.

అర్కబింబము మధ్యందినాతపంబు
గాయుచున్నది మేనెల్లఁ గమలిపోవ ;
నురుగుఁ గ్రక్కుచు నూర్చుచుఁ నోరుదెరచి
యొక్కయడుగైనఁ బెట్టవు దుక్కిటెడ్లు.

ఖరకరతాపతప్తమయి కాయము ఘర్మకణాళినీనుచున్
సొరిగెడి సత్త్వహీనముగఁ జూపులు దీనములయ్యెఁ బ్రొద్దువం
బొరసిన మోము తేటలెటుపోయెనొ! దప్పియు హెచ్చెనోయి యి
త్తఱిఁ దరుమూలశాయివయి తాపము వాయుము చల్లనీడలన్

కరము కష్టించు నినుగాంచి కనికరమున
నెండ వేడిమిఁ దొలగించు నిచ్ఛతోడ
వారిదం బాతపత్రమై వచ్చెఁగాని
మారుతాహతి శిథిలమై మరలెనదియు

తరువులఁ గోటరంబులకుఁ దారెను బక్షికులంబు, బత్త్రెలున్
సరసులఁ జొచ్చెరోజుచుఁ గనఁబడ రెవ్వరు దారులందు, నీ
సరణి సచేతనప్రకృతి చల్లదనంబున కాసచేయ మే
నెరియఁగ నీవుమాత్ర మిటులేల శ్రమించెద వెఱ్ఱెండలన్ ?

బాటల వేఁడిపుష్మలకుఁ బాదములం జిఱుబొబ్బలెత్తఁ గ్రీ
యాటగఁ జెమ్మటల్ మొగమునుండఁ దొరంగఁగఁ గూటిదుత్తతో
బాటలగంధి వచ్చెడిని పాపము! వేగమ నీట మున్గి య
చ్చోటనె మజ్జిగన్నము రుచుల్వొచియింపుచు నారగింపుమీ.

తరుణీ! ధూళులఁ గాళ్లుగాలెనని సంతాపంబునం గాంతుని
జిఱుముత్రాడక, గేహనిర్వాణమున్ సేద్యంబు సాగంగ ని
ద్దఱుఁ గష్టింపఁ గుటుంబరక్షణము సాధ్యంబౌను; భిన్నాశ్వసం
చరణాసక్తహయద్వయంబు రథమున్ సాంతంబుగా లాగునే?

శ్రమకుచితంబుగా ఫలము సంధిలదోయని చింతవొందకో
రమణి నిదాఘ తాపము దొఱంగెను నంతకు ముత్రియూడజొం
పముల యుయ్యాలలూఁగి పదమాత్రన యింటికిఁబొమ్ము పాలకై
కుములుచు నేడ్చునేమొ యనుగుం బసిపాపఁడు నిద్రలేచుచున్

దారిఁజరించుచున్న పుడు దగ్గఱనున్న తటాకమందు నిం
పారు సరోజముల్ గొని గృహంబునకుం జనుదెమ్ము. బాలకుం
డారమణీయ పుష్పముల నచ్చెరువొందుచుఁ గాంచి యాడుకోఁ
దీఱిక వంటయింటి పని దీర్పఁగఁ గాంతుఁడు వచ్చునంతకున్.

పూవుందేనియ లారగించి మధుపవ్యూహమ్ము కర్ణప్రియం
బై వర్ధిల్లు మనోజ్ఞగీతముల రాగాలాపము ల్సేయఁగా
నీవేలా కలరుఙ్కృతిన్ స్వరము లెంతే నైక్యముం బొందఁగాం
తా! వాఙ్మోహక పల్లెటూరి పదమైనం జిత్తముప్పొంగఁగన్.

సిరిగల యాఁడుబిడ్డలు విచిత్రపుఠాలనగల్ ధరించి బం
గరుసరిగంచు చీరలను గట్టి చరింపఁగఁ గాంచి యాస లోఁ
బొరయకు కృత్రిమంబులగు భూషలుదాల్పు; నమూల్యరత్నమౌ
సరసపుఁ బ్రేమ చిత్తజలజంబు వెలుంగ నలంకరింపుమీ.

వెలగల రత్నభూషలను వేలకుఁదాల్చిన నిన్నుఁగాంచుచోఁ
గలుగదు ప్రేమ భర్తకు వికస్వరమౌ వదనారవిందమం
దొలికెడు ముద్దులేనగవు లొక్కనిమేషము దోఁపకున్న; భూ
షలు ప్రణయానుబంధసదృశమ్ములు గావు కులాంగనాళికిన్.

అతుల సంసారసాగర మందుఁ గాల
జలము సుకృత దుష్కృత వాతచలిత మగుచు
సుఖవిషాదపుఁ దరఁగలై సుడియుచుండ
పడవవై గట్టుచేర్తువు పతిని గృహిణి!

ఈయెడ నాతపంబు శమియించెను, నీడయుఁ దూర్పుదిక్కుకుం
బోయెడు భర్తతో నలిగి పొందెడయం జను జాయపోలికన్
వాయువు సుప్రసన్నమయి పైఁబయి వీచెడు లేచిరమ్ము, లే
దోయి విలంబనం బనెడి యుక్తి కృషీవలవాఙ్మయంబునన్.

మనుజసమాజనిర్మితి సమంబుగ నీకొక ముఖ్యమైన వృ
త్తి నియత, మట్టిధార్మికవిధిం జిరకాలము గౌరవంబుతో
మనిచిరి నీపితామహు లమంద్యసుశీలురు సర్వవృత్తిపా
వన కృషిజీవనైక పరిపాలన లోకహితార్థకాంక్షులై.

అనుదిన మిట్లు కష్టపడ నావిధి వ్రాసె నటంచు నీమదిం
బనవకు కర్షకుండ! యిలపై జనియించినదాది చెమ్మటల్
గ్రానక శ్రమించి పౌరుషముతో బ్రతికించెదు నీకుటుంబమున్,
మనమునఁ గైతవాశయము మందునకైనను లేదు నీయెడన్.

నేలనూతుల కుగ్గాలు సలుపువారు,
బోడితలకు మోకాళ్ళకు ముడులు వెట్టు
వారుఁ, జటికెలఁ బంద్లొపన్నువారు
నిన్నుఁ బోలరు, తమ్ముఁడా, యన్నఁడైన.

పఱుపులుపట్టెమంచములుఁబట్టుతలాడ [illegible]ఁబరంబులుం
గరులుఁదురంగముల్ ప్రియయుఁ గాంచనమున్నయవియుండిన
న్ధర సకలంబు సొంతమయినం దనివోదు మనుష్యతృష్ణ. త
త్పరిచితులైన వారి నెడఁబాయదె తృప్తి నిసర్గశత్రుతన్.

అన్నా హాలిక! నీదుజీవితము నెయ్యంబార వర్ణింపమే
కొన్న న్నిర్ఝరసార వేగమున వాక్పూరంబు మాధుర్య సం
పన్నంబై ప్రవహించుఁగాని యితరుల్ భగ్నాశులై యీర్ష్యతో
నన్నుం గర్షకపక్షపాతియని నిందావాక్యము ల్వల్కరే!

వనలతయైన నాకవిత పత్రపుటంబులఁ, బూవురెమ్మలన్
దినదినజృంభమాణమయి తేజరిలెఁ సహజప్రకాశం వ
ర్ధననియమానుసారముగఁ; దల్లత యెన్నఁడు దోఁటమాలిపా
శిని గనుఁగోని వన్యరమణీయతఁ జిల్కు నపూర్వపద్ధతిన్

పంజరనిబద్ధకీరంబు బయలు గాంచి
యష్టకమ్ముల దాఁటంగ నాసచేయు
నటు, బహిర్ణియమంబుల నతికరించి
మన్మనంబు స్వాతంత్ర్యసీమకుఁ జరించు

కాన, యెవ రేమి యనుకొన్న దాన నేమి
గలుగుఁ? గాల మనంతము; ఇల విశాల;
భావలోకము క్రమముగాఁ బడయు మార్పు
ఏల హృదయంబు వెలిపుచ్చ నింతయళుకు?

సైరికా, నీవు భారతక్ష్మాతలాత్మ
గౌరవ పవిత్రమూర్తివి! శూరమణివి!
ధారుణీపతి పాలనదండ మెప్పుడు
నీ హలంబు కన్నను బ్రార్థనీయమగునె?,

దైనికావశ్యకమ్ముల దాఁటిపోవ
వెగుర ఱెక్కలురాని నీయిచ్ఛలెపుడుఁ;
బైరుపచ్చలె యవధిగాఁ బ్రాఁకుచుండు
నీవిచారము, నూహయు, నిపుణతయును.

పొద్దువొడిచిన దాదిగాఁ బొద్దుగ్రుంకు
వఱకుఁ గష్టింతువేగాని యిరుగుపొరుగు
వారి సంపదకై యీసుఁ గూరఁబోవ
వెంత నిర్మలమోయి, నీహృదయకళిక!

పల్లె యెల్లయె సర్వప్రపంచసీమ!
ప్రియ యొకర్తయె రమణీయ విగ్రహంబు!
బంగరుం బంటపొలములే భాగ్యనిధులు!
అనుదిన పరిశ్రమమె మత మగును నీకు.

ఉండి తిన్నను లేక పస్తున్నఁగాని
యాసచేయవు పరుల కష్టార్జితంబు!
నాఁకలెత్తఁగ నీపంచ కరుగు నతిథి
తినక, త్రావక, పోయిన దినము లేదు,

కృషి సకల పరిశ్రమలకుఁ గీలుచీల;
సత్పరిశ్రమ వాణిజ్యసాధనంబు;
అఖిల వాణిజ్యములు సిరికాటపట్లు;
సిరియె భోగోపలబ్ధికి జీవగఱ్ఱ.

కావునఁ గృషీవలా, నీవె కారణమవు
సాంఘికోత్కృష్టసౌభాగ్య సౌఖ్యములకు:
ఫల మనుభవించువారలు పరులు; నీకుఁ
గట్టఁగుడువను గఱవె యెక్కాలమందు!

ఫలము మ్మెక్కెడివారు తత్ఫల రసాస్వాదక్రియాలోలురై
పలుమా రమ్మధురత్వము న్నుతల సంభావింతురేగాని, త
త్ఫలహేతుక్రమ వృక్షముం దలఁపరెవ్వారైన, నష్టే రమా
కలితుల్ భోగములన్ భుజించుచు నినుం గన్నెత్తియుం జూతురే

అట్టి కృతఘ్నులన్ మనమునందుఁ దలంపక సేద్యనాద్యపున్
ఘట్టన నస్థిపంజరముగాఁ దనువెండినఁగాని, వర్షముల్
పట్టినఁగాని, క్షామములు వచ్చినఁగాని శరీరసత్త్వమే
పట్టుగ స్వశ్రమార్జితము పట్టెఁడు నన్నముఁ దిందు వెప్పుడున్!

రాజకీయ ప్రపంచ సామ్రాజ్యమందు
శౌర్యఖడ్గంబులకు లేదు శాసనంబు;
సంఘురాజ్యంబు నేలు విస్తారశక్తి
సతము నాచార ఘోర పిశాచరాజు.

శౌర్యమునకును నాచార చక్రమునకు
మధ్య- లోకంబు దవిలి సమ్మథితమగును;
కాలగర్భంబునం దెట్టి ఘటనగలదొ
పూర్వపద్ధతి విప్లవ స్ఫురణఁగొలుప!

కల్యకాంతికి మున్నంధకారరాత్రి,
వర్షపాతంబునకు మున్ను వారిదముల
ఢమఢమాడంబరంబులు నమరు; నిదియుఁ;
బ్రకృతిభావంబునకు నూత్నపథముగాదు.

కష్టసుఖముల నీచోచ్చ గతులు గలవు
చక్రదండంబులకుఁబోలె; సమయమందు
నిట్టిమార్పు లనంతమై యెసఁగుచుండు
భావి పరిణామ మెవ్వరు పలుకఁగలరు?

ఓ కృషీవల! నీవు కష్టోత్కటంపు
దుర్భరావస్థ యందె తోఁదోపువడఁగ
నెవరు శాసించువారు, నీకేమికొదువ?
ఆత్మవిజ్ఞానమయముగా నలవరింపు.

దారిద్ర్యంబను పెల్లుపేటి కెదురై దాఁటం బ్రియత్నించుచుం
బూంరావేగమునం జలించి వెనుతోృపుల్వోవు కాంక్షోదుపం
బేరా పొందక నెట్లు తెడ్లగు మన స్వేచ్ఛాప్రకారంబుఁ గా
ర్యారంభంబును ధైర్యమున్విడకుమయ్యా, నీవు వేయింటికిన్.

రార సైరిక, కనుఁగొమ్ము రమ్యమైన
సస్యకేదార ఖండంబు! సత్కవీశ
భావలోచన మెరవుగాఁ బడయకున్నఁ
గాంచనేర వంతర్లీనకాంతిసరణి.

అనిలాలోలవినీలసస్యములు భంగానీకముల్గాఁగ దె
ల్లని కొంగల్ పయిఁ దేలు నుర్వులుగ లీలన్ ఱెక్కలల్లార్ప, మ
ధ్యను రాజిల్లు కుజంబు లోడలుగ వాతస్ఫూర్తిఁ గంపింప, స
స్య నికాయావనిసాగరంబటుల నేత్రానందముం గూర్చెడిన్.

కుసుమ లతావలీ వలిత కుంజములం, గిసల ప్రకాండముల్
పసరులు గ్రిక్కు వృక్షముల బాలతృణంబులఁ జేలగట్లు సొం
పెసఁగ, సమస్తరత్నముల నేరిచి కూర్చిన డాలబిళ్ళలన్
వసుధ కమర్చిరో కృషికవర్యు లనన్ వరిమళ్ళు శోభిలున్.

మరకత చూర్ణవర్ణముల మండితమౌ నవశాలిభూమి సుం
దరతను గాంచ వైదిక దినంబులలో భరతక్షమాధరం
ధరయగు సస్యలక్ష్మి దయదప్పక నేఁటికి నార్యధారుణీ
భరణ కుతూహలస్ఫురణ భాసిలునో యనఁనొప్పు పాలికా.

కడమొదలులేని నీ దేహకష్టములకుఁ
బ్రతిఫలంబగు సస్యసంపత్తి గాంచి
కవివి గాకున్న వాగ్మిత గలుగకున్నఁ
బ్రణుతి వర్ణింపు మొకసారి భాగ్యగంమ!

ఆకాశంబున మేఘమాలికల రూపైనం గనన్ రాదు, శు
ష్కాకారంబులఁ బైరులెల్ల సుదుమై యల్లాడెఁ. దీవ్రింబుగా
సోఁకెన్ సూర్యమయూఖతాప, మిఁక నేజోకన్ ఫలించున్ వరుల్
మాకీకష్టము వెట్టెదైవమని యేలా మాటికిం జింతిలన్?

కఱకుగ నెండకాయు నిఁకఁ గాసముతప్పె ననంగ నేల? భా
స్కర కిరణాళిలోఁ గలదు సస్యసముద్ధరణైకశక్తి; త
త్కిరణము లబ్ధివారి పయికింగొని యావిరిరూపునన్, నభోం
తరమున మార్చు నీరద వితానముగాఁగఁ బునఃప్రవృష్టికిన్.

అల వర్షాగమలక్ష్మి రేఖ యనఁ దివ్యాసువర్ణంబులం
బొలుపుంబొందు నవాబ్దమాల యదిగో భూభృచ్ఛిరోలంకృతిం
దలపించుం గనుఁగొమ్మ, వాయునిహతిం దద్దేశముం బాసి కొం
గలబారుల్ వెనువెంట నంట శకలాకారంబులన్ వచ్చెడిన్

బావికి నీటికై యరుగు పల్లెతలంబుధరంబు గాంచి య
ప్పా! వినువీధి హాలికులపాలిటి దైవమె యంబుదాకృతిన్
భావిఫలోదయప్రకటభావమునం జనుదెంచె నంచు మో
దావృత చిత్తలై సరసమాడుచుఁ బోయెదరో కృషీవలా!

పొలమునఁ గంచెగా మొలిచి పువ్వులుపూచెడు కేతకంబు లు
జ్జ్వల కుసుమోపహారములఁ బత్రపుటంబుల నుంచి మారుతా
చలితకిసాలయోచ్ఛలన చాతురిఁ బిల్చెడుఁ, జేరఁబోయి త
త్కలికఁ బరిగ్రహించి కులకాంతకుఁ గానుకయిమ్ము, తమ్ముఁడా!

ప్రావృడంభోదలక్ష్మి యావాసమునకుఁ
బాఱఁగట్టిన నవరత్న తోరణంబు
నాఁగఁ గోమల శబల వర్ణములతోడ
నింద్రచాపంబు శోభిల్లె నిదిగో చూడు.

వానతూనీఁగ లాకాశ పథమునందు
మధుర ఝుంకార రవములు మందలించెఁ;
జల్లగాలికి తురుగప్ప లెల్ల మడుల
బెకబెక మటంచుఁ గూసెడి వికటరుతుల.

తటములకు నాకసమున కంతరము లేక
నీలనీరదమాలలు వ్రేలుచుండ
నేలపై మిన్ను పడనీక నిలుపుచుండు
స్తంభము లనంగ గిరులు దృశ్యంబులయ్యె.

తపనుఁ డంబుదాచ్ఛాదన తతులలోన
ముడుఁగువడిపోవఁ గని నీలగిరులు చల్లఁ
దనము భువి నాక్రమించిన యనువుగాఁగ
వాయుమండల మీమిరి పట్టియుండె.

తెల్లపట్టు మస్లీనుల తెరలలోన
నాడుకొనుచుండు పసిపాప యరువు దోఁప
వానముత్యాలు గూర్చిన వలల తెరల
దినరమామణి మృదుకాంతిఁ దిరుగుచుండె.

త్రావనీరైన దొరకని తరుణమందు
నిమిషమాత్రాన దొరువులు నిండిపోయె!
నఖిల లోకాశ్రయుండు కృపామృతుండు
కన్నుదెఱచిన జరుగని కార్యమున్నె?

జల్లు పెల్లుడుగంగఁ బిల్లలు, తొల్లొలు
నిలువఁబట్టిన నింట నిలువఁబోక,
వాననీరులు వాఱు పల్లపు టిసుకలఁ
గయ్యాగాఁ గట్టలు గట్టి చిన్న

నాగళులం బన్ని లేఁగదూడలఁ గట్టి
దున్నుచు విత్తులు మన్నుగలిపి
పచ్చయాకులు చల్లి పైరుపస్పై నటుఁచుఁ
గలుపుఁ దీయుచుఁ గోఁతకాల మనుచు

వరులు గోయుట నటియించి పనలుగట్టి
కుప్ప వేయుటగా మన్ను కుప్ప వెట్టి
కడకు నేల చదునుగాఁగఁ గాలఁ దన్ని
యాఁకలెత్తిన నిండ్లకు నరుగుచుండ్రు.

జడివానన్ వలిబడ్డ బక్క మొదవుల్ సంఘంబులై బీళులన్
విడియఱ్ఱాడుచు దొడ్డిఁజేర నవిగో వేగంబుగ న్వచ్చెఁ; బె
ల్లడుసుల్ వ్రేవని మిట్టనేలఁ బసిఁ గొయ్యల్నాటి కట్టించి వెం
బడ వేయింపుము గడ్డిగాదములు చొప్పల్ బొందుపుల్లంటులన్

తమ్ముడు కుఱ్ఱ;గోచయము దాఁటులువెట్టుచుఁ ద్రేపుదామెనం
ద్రమ్ముచు జిఱ్ఱకొట్టుచుఁ బరస్పరముం దల డీలుకొంచు ము
న్గొమ్ములఁ జిమ్ముచుం దిరుగఁ గొట్టినఁ బట్టిన లొంగిరావు, సా
యమ్మొనరింపు మీయదన నాలమరల్పఁగఁ బల్పువెట్టఁగన్

తడిసిన పచ్చికట్టియలు తంగెడు తప్పర తాటియాకులం
బడఁతుక ప్రొయ్యిలో దుఱిగి పైఁబొగ లెత్తఁగ నూఁదుఁగాని కూ
డుడుకదు; కాఁకకుం బొగకు నుప్పతిలెం గడగంట బాష్పముల్;
తడయక యెండు రెమ్మలను దప్పెఁడు త్రుంచుమ చెట్టుచేమలన్

మును వేసంగిని గుచ్చివిడ్డ పిడకల్ బొప్పళ్లు బొళ్ళెంబులన్
వెనుకం బెట్టిన తాటిమొండ్లు బరికెల్ వెళ్ళించె నిన్నాళ్ళు; నిం
క నవాంభోధర మాలికా పిహిత దిగ్జాలంబులై వర్షపున్
దినముల్ డగ్గరెఁ, గాంత బానసము నేతీరొప్ప సాగించెదన్

పొలముల బీళులం దిరిగి ప్రొద్దెడ గ్రుంకఁగ నిల్లుసేరి పా
పల నొడిఁ జుట్టుఁ బెట్టుకొని భార్యను నన్నముఁ దెమ్మటంచు వే
పిలిచెద, వొంటికాఁపురము, పిల్లల గిల్లల బుజ్జగించుకో
వలసిన యాలిపాటుఁ దలఁప గిరుణింప వదేల హాలికా

ఉప్పుతోఁ దొమ్మిదియున్న కాఁపురములు
సేయు గృహిణుల కేచిక్కు లేదు,
ఎవ్వి లేకున్నను నిరుగు పొరుగు కులాం
గనలకుఁ జేయొగ్గి కైకొనుటకు

నిష్టపడక, యున్నదే పెట్టి యక్కఱ
వాపుకొనెడు మానవతుల కెందు
లేమిడి సంసార మేమెయిఁ బరువుతోఁ
గడపంగ నిక్కట్లు గలుగుచుండు,
నెన్నికష్టములున్న నిట్లని పలుకక
పొసఁగినయంతకుఁ బొదువుచేసి

మగనికిని బిడ్డలకుఁ బెట్టి మిగిలియున్న
యింతఁ దాఁ దిని భిక్షున కిడు పురంధ్రి
శాంతి నీతియు నురుకష్ట సహనశక్తి
నెవ రెఱుంగుదు రంతటి యింతి దక్క!

తల తాకట్టులు వెట్టి ధనికుల దగ్గఱఁ
బన్నుకై గొన్న రూపాయలప్పు
కూలికి నాలికిం గూటికిం జాలక
నామగాఁ గొన్న ధాన్యంబుటప్పు
చిల్లర మల్లర చేబదులుగఁ దెచ్చి
యక్కఱ గడిపిన యట్టి యప్పు
పుడుగపర్వాల బందుల విందుకై
సామానుగొన్న బజారుటప్పు

వాయిదా మించవచ్చిన వడ్డియప్పు
పడఁతిసొమ్ముల కుదువకుఁబడ్డయప్పు
వేగ తీఱిచి స్వాతంత్ర్యవీధి యందు
సంచరింపుము నిశ్చింత సంతతంబు.

పవలు నడచుఁబ్రొద్దు; తోఁపవిందు రేవేళఁ;
బవలు రేయి నడచుఁ బాఁమువడ్డి!
అప్పుచేసి కుడుచు పప్పుకూఁడుల కన్నఁ
గాసు ఋణములేని గంజిమేలు.

సంఘపరివర్తనంబులు జరుగుచున్న.
రాజకీయ సంక్షోభంబు రగులుకొన్న,
విప్లవంబుల దేశమ్ము వీఁగుచున్నఁ,
గృషిఁద్యజింపకు కర్షకా, కీడు గలుగు

నవ్యపాశ్చాత్య సభ్యత నాగరకత
పల్లెలందు నస్పష్టరూపములఁ దాల్చి
కాలసమ్మానితములైన గ్రామపద్ధ
తులను విముఖత్వముం గొంత గలుగఁజేసె

పంచాయతీసభా భవనంబులో రచ్చ
కొట్టంబు లోకమూలఁ గూలిపోయె,
వీథిబడులఁ జెప్పు విజ్ఞానధుర్యులు
నొజ్జలు దాస్యంబు నూఁత గొనిరి,
గ్రామపరిశ్రమఁ గలుగు సన్యోన్యమౌ
సహకారవృత్తంబు సమసిపోయె,
సత్యజీవనము, విశ్వాసమ్ము, భక్తియు
నైకమత్యము,మున్న యంతరించె

బూటకములు, కుయుక్తులు, మోసగతులు
కోర్టువ్యాజ్యాలు ఫోర్జరీల్, కూటమైత్రి,
స్వార్థపరత, మౌఢ్యంబు, గర్వప్రవృత్తి
నేర్పు విద్యాలయంబులు నేఁటియూళ్ళు!

నేఁటినాగరకత నీమేలుఁ గోరక
యప్పుచేసి బ్రతుకుమని విధించు;
నాయవృద్ధికన్న నావశ్యక పదార్థ
సంఖ్య హెచ్చఁ జిత్తశాంతి యున్నె?

జీవనస్పర్ధ సామాన్యచేష్టయైనఁ
గాలమున వ్యక్తివాద మగ్రత వహించు
సత్త్వ విరహితుఁ డన్యభోజ్యత సహించు;
సర్వజీవియె యంతరాయముల దాఁటు.

కాన, జీవనసంగ్రామ కార్యమందు
విజయి వగుటకు శౌర్యంబు విద్య బుద్ధి
సత్యసంధత యాత్మవిశ్వాస మనెడు
నాయుధంబుల విడువకు హాలికవర్య.

చాలు విజ్ఞానమతబోధ! సాంధ్యరాగ
కాంతిఁ బండిన కేసరి కారుచేలు
స్వర్ణసైకత ఖనులుగా బరిణమించెఁ
గనుల కాప్యాయనంబుగఁ గాంచుమోయి.

బారులుదీర యంబరముపైఁ జరియించెడు నీటికోళ్లు లిం
పారఁగ సాంధ్యలక్ష్మి మెడయందు ధరించిన తారహార రే
ఖారమణీయతం జెలుకఁ గాలువనీటికి నేఁగు కన్యకల్
వారక కొంతసేపు కనువాల్పక చూతురు విస్మయంబునన్.

గోపద ధూళి ధూసరిత గోపకుమారులుఁ గాఁపుపిల్లలున్
మూఁపునఁ గఱ్ఱలుం జలిదిబోనపు దుత్తలు, చంకలోనఁ బె
న్నోపెఁడు దూడపల్పు లిడి మోహనవేణురవంబు సేయుచున్
మాంపటివేళగాఁ బసులమందలు దోల్కొనివచ్చి రిండ్లకున్.

స్వారిచేయు నిచ్చ భావంబు గలిగింప
బఱ్ఱనెక్కి వచ్చు బాలుఁ డొకఁడు;
వానిగ్రిందఁద్రోయు నజకు బఱ్ఱను బాఁది
సంతసింతు రితరసఖులు నగుచు.

బడి విడిపించంగ బాలురు వీధులఁ
బరుగెత్తి యుప్పరపట్టెలాడఁ,
బంటచేలకుఁ బనిపాటుల కేఁగిన
కర్షకు లిండ్లకుఁ గదలుచుండ,
స్నానంబు లొనరించి సరసుల భూసురుల్
భక్తిభావన సంధ్య వార్చుచుండ,
'సందాకవళమమ్మ సత్తెమేజయ' మని
యన్నార్థులగు భిక్షు లరుగుదేరఁ

పక్షు లెల్లను గూళులఁ బట్టి చనఁగ
నచ్చటచ్చటఁ దారక లవతరింప
మొలకచీఁకటి దిక్కులు మలినమయ్యె,
సంజ రాతిరి గర్భాన సమసిపోయె.

ఇంతకు రాఁడు కాంతుఁడని యింతి విచారముతోడ ద్వారబం
ధాంతరమందు నిల్చి కనులార్పక దారులు చూచుచుండ నీ
వంతగ నాలసింపఁ దగవా? మగవారలయట్లు కాతర
స్వాంతలుగాక, కామిను లనాగతకష్టము లెంతు రెప్పుడున్.

ఆయెను రచ్చలోని వ్యవహారము లూరక పొల్లుమాటలం
బోయెను నర్థరాత్రి, మిఁకఁ బొమ్ము గృహమ్మును జేర, బిడ్డలున్
నాయన నాయనంచుఁ గరుణమ్ముగ నేడ్చుచునున్నవారు, ము
న్నాయితపెట్టె స్నానమునకై నులివెచ్చని నీరు భార్యయున్.

ల య వి భా ర తి

చలువగల కప్పురము చిలికినటు చల్లనయి
లలితకలధౌత మృదువిలసనము పోలెన్
మొలకలిడు వెన్నెలల చెలువము దిగంతముల
కలముకొని తారకల తళుకులను గప్పం

గలువపొడి గందవొడి దొలఁక సుడి రేఁగుచును
మెలఁగు నెలపయ్యరలు నలసతఁ జరింపఁ
దలఁపున రసార్ద్రమగు వలపు లిగురింప, దిన
కలకల మడంచి నిశ గొలిపెఁ బ్రమదంబు నక

స్నాన మొనరించి, వెన్నెలచలువ బయల
బిడ్డలు న్నీవు నిల్లాలుఁ బ్రీతిఁ గుడిచి
పొడుపుకతలు, సమస్యలుఁ, బూర్వచరిత
లంత వచియింపు వారలు సంతసింప.

శ్రమ, విషాదమ్ము, లాసలు, సర్వకాల
హృదయభేదక చింతలు నిదుర యనెడు
శాంతవారిధి లీనమై సమసిపోవ
విశ్రమింపుము, సైరికా, వేగుఁజుకు.

Printed at the Aruna Press, Nellore.

# సవరణపట్టిక

| పంక్తి | - | పుట | ముద్రణ | — | సవరణ |
|---|---|---|---|---|---|
| 10 | - | 12 | మొలిచి | — | మొలచి |
| 14 | - | 12 | గయిసెని | — | గయిసేని |
| 14 | - | 12 | లెజివుపులం | — | లేజివుపులం |
| 14 | - | 17 | ముస్మఱియేమియుండిన | - | ముఁ మఱియేమియుండినఁ |
| 15 | - | 17 | స్ధర | — | ఘర |
| 8 | - | 20 | లబ్థి | — | లబ్ధి |
| 14 | - | 20 | ముస్నుతల | — | ముస్నుతుల |
| 5 | - | 24 | నెంతకాయ | — | నెంతగాయ |
| 10 | - | 25 | మధుర | — | సరస |
| 10 | - | 25 | మంపలించె | — | సలుపుచుండె |
| 11 | - | 25 | తుదు | — | సుదు |
| 13 | - | 34 | లయవిభారతి | — | లయవిభాతి |
| 12 | - | 35 | వేగుఱకు | — | వేగుపఱకు |

31

కవికోకిల

స్వర్గీయ

# దువ్వూరి రామిరెడ్డిగారి

## గ్రంథములు

1. నలజారమ్మ (పద్యకావ్యము)
2. వనకుమారి ,,
3. కృషీవలుడు ,,
4. జలదాంగన ,,
5. యువకస్వప్నము ,,
6. కడపటి వీడుకోలు ,,
7. పానశాల ,,
8. పలితకేశము ,,
9. కవి - రవి ,,
10. మిత్రార్ధశతకము
11. మాతృశతకము
12 గులాబితోట (కథలు)
13. పండ్లతోట (ప్రబంధకావ్యము)
14. నక్షత్రమాల (ఖండకావ్యము)
15. నైవేద్యము ,,
16. భగ్నహృదయము ,,
17. ప్రథమకవిత్వము ,,
18. సీతావనవాసము (నాటకము)
19. మీరాబాయి ,,
20. మాధవవిజయము ,,
21. కాంగ్రెసువాలా ,,
22. సారస్వతవ్యాసములు
23. తెలుగుకవితలో క్రొత్తతెన్నులు
24. రేడియో వ్యాసములు
25. The Last Farewell
26. The Voice of the Reed

---

అరుణా ప్రెస్ — నెల్లూరు.

కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు నవంబరు తే 9 ది 1895 నాడు గూడూరులో జన్మించారు. చిన్ననాటినుండి విజ్ఞాన శాస్త్రమ్మీదే వీరి మనసంతా. అందుకే వీరి స్కూలుజీవితం చాలకొద్ది.

చిత్రలేఖనము, శిల్పము వీరి బాల్యజీవితానికి క్రీడారంగా లైనవి. 19 వ యేట వీరు కవితారంగంలో ప్రవేశించారు. స్వయం కృషితోనే ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, సంస్కృతము; బెంగాలీ, పెర్షియన్, వురుదు, తమిళంలో పాండిత్యం గడించారు. వీరు కొంతకాలం సినిమాలో డైరెక్టరుగా పనిచేశారు. వీరి కవిత్వ క్రొత్తలకు, ప్రాక్పశ్చిమాల మేలి కలయికగా అందాల ల కుంది. శ్రమజీవియైన కర్షక జీవితము కవితా వస్తువేసని చాడు. ఖయాము రుబాయతుల తెలుగులో యెంత మధ గానంజేశాడో? కర్షక జీవితాన్ని అంత కమ్మగా పాడాడు.

1920 ల్లోనే విశ్వశాంతికోసం వేదనపడి, శాంతిగీతిక లాల పించిన యీ కళాశీలి. తెలుగు సారస్వతారామాల్లో, నూతనవల్లికల నవకుసుమాల పూయించి మనకిచ్చి,1947 సెప్టెంబరు 11 వ తేదీన దివంగతులైనారు.

మూల్యం 12 అణాలు.



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA105 B 150. |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CP, 36, BCP |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | prasyAA |
| పేజీలు విడదీసినది | TLasin |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |